**తెర వెనుక... (లఘు నాటిక)**

**మూలం**
**డా. రషీద్ జహాన్**

**స్వేచ్ఛానుసరణ**
**గౌరవ్**

**ఆగస్ట్ 2024**

**ఆధారం**
**అరవింద్ గుప్తా టోయ్స్ / బుక్స్**

**మూల్యం :**
**అమూల్యం**



**వివరాలకు**
gouravmeka@gmail.com

# అంకితం



కీ.శే. మొహమ్మద్ సైఫుద్దీన్, వలీ బేగం ఉన్నీసా దంపతులు మిత్రుడు కరీముల్లా అమ్మమ్మ తాతయ్యలు. మిత్రులు భాషా గారి తల్లి దండ్రులు. సుమారు రెండు దశాబ్దాల క్రితం సంగతి. సైఫుద్దిన్ గారు నాకు ఉర్దూ అరబిక్ కొంతకాలం శ్రద్ధగా నేర్పారు. తర్వాత నేను హైదరాబాద్‌లో ఉంటున్న కాలంలో ఉర్దూలో రాసిన ఉత్తరాలు చూసి మురిసిపోయారు. తర్వాత కొద్ది కాలానికే అనారోగ్యంతో మరణించారు.

మా ఊరి మసీదు పక్కన తావీజులు కడుతూ అదయ్యాక సాయంత్రాలు నాకు ఉర్దూ పాఠాలు నేర్పేవారు. అప్పటికే వయసు మీద పడినప్పటికీ చాలా శ్రద్ధగా పాఠాలు చెప్పారు. సంస్కృత వేద స్మార్త పాఠాలకి ఎంత శ్రద్ధగా వెళ్ళానో అంతే శ్రద్ధగా సైఫుద్దీన్ గారి వద్దకీ వెళ్ళేవాడ్ని. అదో వైచిత్రి. అలా చివరివరకూ నన్ను నన్నుగా ప్రేమించిన సైఫుద్దీన్ తాత గారికి, వలీ బేగమ్ వున్నీసా మామగార్ని తల్చుకుంటూ,

అనుబంధాలు ప్రధానంగా హార్ధికాలే కానీ ఆర్ధికాలు కావు. ఆత్మీయతలు ముఖ్యంగా పెంచుకునేవే కానీ తుంచుకునేవి కాబోవు. ఎల్లలు లేని మీ ప్రేమకు, అభిమానానికి, ఎన్నని ఉదాహరణలు ఇవ్వను? హద్దుల్లేని మీ మైత్రికి, మంచితనానికి ఎలా కృతజ్ఞతలు చెప్పను?? అందుకే నన్ను కూర్చోబెట్టి అలీఫ్, బేలు నేర్పిన మీ సంస్కారాన్ని గుండె లోతుల్లోంచి గుర్తు చేసుకుంటూ ఈ కృతిని "మొహమ్మద్ సైఫుద్దీన్, వలీ బేగమున్నీసా"ల స్మృతికి ఇలా...

**- గౌరవ్**

# అనువాదకుడి మాట

డా. రషీద్ జహాన్ భారతీయ ప్రగతిశీల వారసత్వానికి తిరుగులేని ప్రతీక. అసాధారణ ప్రజాపక్ష మేధావిగా, సాంస్కృతిక కార్యకర్తగా, ప్రజా వైద్యురాలిగా, కమ్యూనిస్టు నాయకురాలిగా, అభ్యుదయ రచయితగా ఆమె విస్తృతి బహుళం. మొదటి ముస్లిం కమ్యూనిస్టు డాక్టర్‌గా, సర్జన్‌గా అణగారిన ప్రజలకి ఎనలేని సేవలందించినామె. చికిత్సకని వెళ్ళి రష్యాలో మరణించింది. మాస్కోలో ఉన్న ఆమె సమాధి మీద "కమ్యూనిస్ట్ వైద్యురాలు, రచయిత్రి" అని ఉంటుంది.

92 ఏళ్ళ క్రితం 'అంగారే' అనే కథా సంకలనంలో చోటు చేసుకున్న 'పర్దే కే పీచే' (Behind the Veil) వివాదస్పదమైంది. ఆ పుస్తకాన్ని నిషేదించడం, తర్వాత తలెత్తిన పరిణామాలు అభ్యుదయ రచయితల ఉద్యమానికి దారి తీసాయి. ఇంకా అనేక రచనలు చేసిన జహాన్ తండ్రి షేక్ అబ్దుల్లా కోరిక మేరకు తన కథల్ని 'ఔరత్' (మహిళ) పేరిట ప్రచురించింది. డా. రషీద్ జహాన్ 120వ జయంత్యుత్సవాన్ని పురస్కరించుకుని ఇదిలా తెలుగు చేయడం జరిగింది.

నిజానికి నా దృష్టికయితే రాలేదు కానీ ఈపాటికే ఇది కచ్చితంగా తెలుగులో వచ్చి ఉంటుంది. నాటి సాంప్రదాయ ముస్లిం మహిళల స్థితిగతులకు అద్దం పట్టే ఈ నాటిక ఇద్దరు స్త్రీల మధ్య సాగే సంభాషణ. ప్రస్తుత పరిస్థితుల్లో మతోన్మాద శక్తులు దీనిని మరోలాగా ఉపయోగించుకునే వీలుందనే భావనతో మొదట ఇప్పుడు అనువాదం అవసరమా? అని తటపటాయించాను. అయినప్పటికీ మొత్తంగా చూస్తే సామాజికపరంగా కొంత మార్పు ఉన్నప్పటికీ ఇందులోని అంశాలు మొత్తం మతాల్లోని పురుషాధిక్యతకి సంకేతాలు.

భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ స్థాపించి వందేళ్ళవుతోంది. దశాబ్దాల చరిత్ర కలిగిన ప్రగతిశీల సాంస్కృతికోద్యమం, అభ్యుదయ రచనోద్యమం కూడా ప్రస్తుతం స్తబ్దంగా ఉన్నాయి. మరోవైపు తిరోగామి శక్తులు రోజురోజుకు బలం పుంజుకుంటున్నాయి. అవాంఛనీయ అసమానతలు పెరుగుతున్నాయి. ఈ క్రమంలో రషీద్ జహాన్ వంటి అంకితభావం గల వ్యక్తుల్ని గుర్తు చేస్కోవడం అవసరమనే అభిప్రాయమే ఈ అనువాదానికి కారణం.

ఒక ఆసక్తికరమైన విషయం ప్రస్తావించాలి. శతాబ్దం క్రితం చలం రాసిన ఏకైక ఆంగ్ల రచన, Man & Woman ని మొదటి అనువాదంగా 2014లో తెలుగులో ప్రచురించి దశాబ్దం అవుతోంది. సరిగ్గా పదేళ్ళ తరువాత మళ్ళీ పురుషాధిక్యతను ప్రశ్నిస్తూ వందేళ్ళ క్రితం డా. రషీద్ జహాన్ రాసిన ఈ 'తెర వెనుక...' నాటిక తెలుగు అనువాదం ప్రచురించడం పూర్తిగా యాధృచ్ఛికమే ఐనా గమనార్హం. ఎందుకనంటే ఈ రెండూ ఆయా స్థాయిల్లో పురుషాధిక్యతా వ్యవస్థలో వీలైనంత విస్మరించబడిన రచనలేనన్నది స్పష్టం. ఆ రకంగా రెంటికీ సామ్యముంది.

ఒకవేళ గతంలో ఈ నాటిక తెలుగులో వచ్చి ఉన్నా ఇలా మరో ప్రయత్నం వల్ల వచ్చే నష్టం లేదు. అలాగే జూలై, ఆగస్టులో జయంతి, వర్ధంతులు జరుపుకుంటున్న జహాన్ కృషికి ఈ నామమాత్రపు నీరాజనం కనీస కర్తవ్యంగా భావించి తెలుగు చేయడం జరిగింది. ఇందులో వాడిన భాష, పదాలు, భావాలు అన్నింటితోనూ నేటి పరిస్థితుల్లో అనువాదకుడు తప్పనిసరిగా అంగీకరించాలనే నియమం లేదని మనవి.

అంతర్జాలంలో లభించిన ఆంగ్ల అనువాదం ఆధారంగా ఇది తెలుగు చేయడం జరిగింది. మొత్తంగా ముస్లిం సమాజంలోని అసమానతలు, ఆక్రందనలపై డా॥ రషీద్ జహాన్ ఎక్కుపెట్టిన కలం యొక్క ఫలితాల ప్రభావం తదనంతర ముస్లిం ఆలోచనాపరులయిన మహిళల మీద బలంగా ఉందనేది స్పష్టం. అందులో భాగంగా నేటి తరానికి ఒకనాటి మహిళల వ్యథల్ని పరిచయం చేయడం, వారి పోరాటాలకి మద్దతు తెలపడమే లక్ష్యంగా ఇదిలా ప్రచురిస్తున్నాం.

డా॥ రషీద్ జహాన్ గురించి తెలిపిన వెంటనే ఆమె ఇతర కథల్ని తెలుగులోకి తీసుకు వచ్చే బాధ్యత ఆనందంగా ఆరంభించి వాటిని అనువదించడమే కాక ఈ అనువాదాన్ని సరిచూసి దీనికి అర్థవంతమైన ముందుమాట రాసిన ప్రగతిశీల స్త్రీవాద రచయిత్రి డా॥ గీతాంజలి గారికి కృతజ్ఞతలు. అనువాద దోషాలకు, వాక్య సమన్వయ లోపాలకు పూర్తి బాధ్యత నాదే. విమర్శలకు ఆహ్వానం.

# తెర వెనకాలి ముస్లిం స్త్రీల జీవన వాస్తవికతను చూపించిన డా. రషీద్ జహాన్!

– డా. గీతాంజలి

(ప్రగతిశీల రచయిత్రి, గైనకాలజిస్టు)

**'పర్దే కే పీఛే...' (తెర వెనుక ,,,) లఘునాటిక.**

**రచన : డాక్టర్ రషీద్ జహాన్ M.D. గైనకాలజిస్ట్,**

**రచనా కాలం : 1932**

**తెలుగు అనువాదం : గౌరవ్ (క్షేత్రస్థాయి, సామాజిక, సాంస్కృతిక కార్యకర్త)**

"నిత్యం లైంగిక అసంతృప్తితో ఉంటూ తనకి రెండో పెళ్లి చేయమని వేధించే నా భర్త బెదిరింపులతో నేను రోజూ హత్య చేయబడతాను. ఆయన మాటలతో వధించబడతాను" – మొహమ్మదీ బేగం!

ఈ ఆవేదనాపూరితమైన మాటలు ఒక్క మొహమ్మదీ బేగంవి మాత్రమే కాదు. పితృస్వామ్య అణిచివేతలో నలిగిపోతూ కొద్దిపాటి వెలుగు కోసం... తమ మనోదేహాల మీద కొన్ని హక్కుల కోసం పోరాడుతున్న భిన్న కులాల, భిన్న మతాల, భిన్న వర్గాల స్త్రీలందరిదీ.

ఇక్కడ మొహమ్మదీ బేగం భర్త నిత్యం లైంగిక అసంతృప్తితో ఎందుకుంటాడు? ఎందుకంటే... అతని భార్య, ఈ నాటకం నాయిక ముప్పై రెండేళ్ల బాధిత మొహమ్మదీ బేగం నిత్య గర్భాలతో... గర్భస్రావాలతో వచ్చిన దీర్ఘకాలిక వ్యాధులతో నరక బాధ అనుభవిస్తూ ఉంటుంది. నిత్య గర్భాలతో ఉండే భార్యతో అతని కోరికలు తీరవు. అలాగని కుటుంబ నియంత్రణ ఆపరేషన్లూ చేయించడు. దానికి అతని మతం.... మతాధికార్లూ ఒప్పుకోరు. నెల నెలా వచ్చే బహిష్టులు ఆగిపోయే వరకూ ముస్లిం స్త్రీ పిల్లల్ని కంటూనే ఉండాలి. అందుకే ఆమె నిర్బంధ నిత్య గర్భాలు మోస్తూనే ఉంటుంది. గర్భస్రావాలు అవుతున్నప్పుడు రక్తహీనతతో పాలిపోతూ నీరసమైపోతూంటే కాన్పు అయ్యాక దొరికే కాలంలో ఆమె భర్త నిర్దాక్షిణ్యంగా మళ్లీ ఆమెతో శారీరకంగా

కలిసి మళ్లీ... మళ్లీ... గర్భవతిని చేస్తూనే ఉండేవాడు. మళ్లీ తానే ఆమె సంవత్సరం పొడుగుతా గర్భంతో ఉండడాన్ని ఎద్దేవా చేస్తూ ఉంటాడు. ఇదీ సగటు ముస్లిం వివాహిత స్త్రీల పరిస్థితి అనాదిగా! ముస్లిం స్త్రీలలో Grand Multi Gravida లున్నారు. బహిష్టులు ఆగిపోయే 45–55 ఏళ్ల వయస్సు వరకూ 14–15 మంది పిల్లల్ని కనే గర్భిణీ స్త్రీలను Grand Multi Gravida అంటారు.

వైద్య పరిభాషలో ఇటువంటి గర్భిణీ స్త్రీలను కాన్పుకు వచ్చినప్పుడు Medical Case Sheet లో $G_{14} P_{10} A_4$ అని రాస్తారు. పధ్నాలుగో కాన్పు, పది మంది పుట్టి బతికిన పిల్లలు, నాలుగు సార్లు అబార్షన్ అవడం అన్నమాట. 20 నుంచి 36 వారాల ముందే పుడితే preterm అని, నెలలు నిండాక పుడితే Full Term అని రాస్తారు. మొత్తానికి ప్రపంచ వ్యాప్తంగా పది మంది కంటే ఎక్కువ పిల్లల్ని కనే దేశాలు మతాలు South Africa ఇథియోపియా నుంచి భారతదేశం వరకూ ఉన్నారు. భారత దేశంలో ముస్లిం మతంలో స్త్రీలు గ్రాండ్ మల్టీ పారిటీ బాధితులు. ఆపరేషన్ చేస్కోమని అడిగిన డాక్టర్లకు వాళ్లు దీనంగా బలహీనంగా 'ఉనో నై మాన్తే' అంటారు. 'ఉన్హో' అంటే ఇక్కడ భర్త అనీ దానితో పాటు మతం అనీ అర్థం!

ఈ పర్‌దే కే పీఛే నాటికలో ముస్లిం వేదనలను అణిచివేతలని భిన్న కోణాలలో డాక్టర్ రషీద్ జహాన్ చాలా గొప్పగా చెప్పారు.

డా. రషీద్ జహాన్ స్వాతంత్రోద్యమ కాలపు రచయిత్రి, గైనకాలజిస్టు.

డాక్టర్ రషీద్ జహాన్ అభ్యుదయ రచయితల సంఘం సభ్యురాలు, కమ్యూనిస్టు నాయకురాలు, ప్రజా రచయిత్రి అవడం మూలాన్న ఆమె తన వద్దకు వచ్చిన స్త్రీ రోగుల మానసిక, శారీరక ముఖ్యంగా గైనిక్ అంటే ప్రత్యుత్పత్తి సమస్యలు, ప్రసవానికి సంబంధించిన అనేక అంశాలను మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించి విశ్లేషిస్తూ నేర్చుకోవడమే కాదు సాహిత్యంలో యథాతథంగా తీసుకొచ్చారు. డాక్టర్ రషీద్ జహాన్ తొలి కమ్యూనిస్టు ముస్లిం డాక్టరు! ఆమెకు ముస్లింల చరిత్ర ఒక నాస్టాల్జియా, ముస్లిం కవులు రాసే మధువు మొహబ్బత్ నిండిన షేర్ షాయరీ కాదు. తన కథల్లో ఈ నాస్టాల్జియా కనపడదు. ముస్లిం స్త్రీలు మతాచారాల పేరుతో అనుభవిస్తున్న

తీవ్రమైన పునరుత్పత్తి సమస్యలను అంటే రిపీటెడ్ ప్రెగ్నెసీలు – గర్భస్రావాలు – వీటి వలన వచ్చే పోషకాహార లోపాలు ముఖ్యంగా రక్తహీనత, కాన్పు సమయంలో మరణాలు, పుట్టక ముందే పిండాల మరణాలు ఎదుర్కొనే మానసిక ఆందోళన వత్తిడి, ఆవేదన, భార్యల నిత్య గర్భాల వలన భర్తల తీరని లైంగిక అసంతృప్తులు, రెండో పెళ్లి బెదిరింపుల వలన ఎదుర్కొనే అబద్రత, భయాందోళనలు, వేశ్యల దగ్గరికి వెళ్ళే భర్తలు అంటించే సుఖరోగాల బాధలు. అధిక సంతానం, పేదరికం... లాంటి సామాజిక, రాజకీయ, మానసిక, ఆర్థిక అంశాలన్నింటిని ఎంతో సూక్ష్మంగా పరిశీలించారు. అధ్యయనం చేసి రాసారు. ఈ ఒక్క 'తెర వెనుక' నాటకంలో ఆమె పైన పేర్కొన్న అనేక అంశాలను జాగ్రత్తగా పేరుస్తూ పోయారు.

నాటకం అంతా బాధిత మొహమ్మదీ బేగం, ఆఫ్తాబ్ బేగం మధ్య జరిగే సంభాషణలోనే నడుస్తూ ఉంటుంది.

నిజానికి నేను 'పెహచాన్' అనే భారత దేశ ముస్లిం స్త్రీల అస్థిత్వ పోరాట కథల్ని రాసినప్పటి కాలం 2000 నుంచి 2007. డాక్టర్ రషీద్ జహాన్ రాసిన 'తెర వెనుక' నాటకంలోని నిత్య గర్భాలతో బాధపడే మొహమ్మదీ బేగం కథ 1932 ప్రాంతంలో అప్పటి భారతీయ ముస్లిం సమాజంలో జరుగుతుండిన కథ. అయితే 2000ల ప్రాంతంలో నేను రాసిన 'ఉనో నహీ మాన్‌తే' (ఆయన ఒప్పుకోరు) కథ సంకలనంలో కూడా, పెహచాన్ కథా సంకలనంలో కూడా 1932– దాని ముందు కాలం నాటి అసమ సమాజాన్ని, ముస్లిం సమాజంలోని బహుభార్యత్వం నుంచి బహిష్టు ఆగిపోయే దాకా నిత్య గర్భాలలో సతమతమయ్యే ముస్లిం స్త్రీల వ్యథార్థ గాథలున్నాయి. ముస్లిం సమాజం 120 ఏళ్ళ తర్వాత కూడా కించిత్తు మార్పు లేదు. సంపన్న వర్గ ముస్లిం స్త్రీల జీవితాలలో కుటుంబ నియంత్రణ చేసుకునే వెసులుబాటు కొంత కన్పిస్తుంది. ఇప్పుడు ముస్లిం సమాజంలో అవిద్య కొద్దిగా తగ్గింది కానీ మిగతా సమస్యలు అలాగే ఉన్నాయి.

కానీ కామ్రేడ్ డాక్టర్ రషీద్ జహాన్ 92 సంవత్సరాల క్రితం ఇంత సూక్ష్మస్థాయిలో చేసిన పరిశోధన ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఆమె ఒక అభ్యుదయవాదిగా

ప్రజా రచయిత్రిగా తన ధిక్కార స్వరాన్ని తన సాహిత్యం ద్వారా ప్రశ్నించడం వల్లనే ఈ కథ అప్పట్లో నిషేదానికి గురి అయ్యింది.

92 ఏళ్ళ క్రితం తెర వెనుక – నాటకం 1932 డిసెంబర్‌లో లక్నోలో నిజామీ ప్రెస్ వాళ్లు ప్రచురించారు. మార్చి 1933 అప్పటి ప్రభుత్వం యునైటెడ్ ప్రావిన్స్ 'అంగారే' కథా సంకలనాన్ని బాన్ చేసింది. ఈ సంకలనంలో సజ్జాద్ జాహిర్, అహ్మద్ ఆలి, రషీద్ జహాన్, మహమ్మూద్ జాఫర్ కథలున్నాయి.

వీళ్లు నలుగురూ ముస్లిం మత సంప్రదాయాల్ని ధిక్కరించి రాసినందుకు united province క్షమాపణ అడగమన్నా వీరు చెప్పలేదు. ఈ ధిక్కారం తరువాతి ప్రగతిశీల అభ్యుదయవాద రచయితల రచనల మీదా, రచయితల వ్యక్తిత్వం మీదా పడింది.

ఈ నాటకాన్ని రచయిత, అనువాదకుడు గౌరవ్ ఎంచుకోవడం వెనుక అన్ని మతాలలో స్త్రీల మీద అమలు జరుగుతున్న పురుషాధిక్య అణిచివేత, ఆ స్త్రీల ప్రతిఘటన. పైగా రచయిత్రి డాక్టరు కావడం అదీ స్త్రీల వైద్య నిపుణురాలు, గైనకాలజిస్ట్ కావడం కూడా ఒక కారణం అయితే స్వతహాగా మార్క్సిస్ట్ అభ్యుదయవాది కావడం, ఫెమినిస్ట్ కావడం కూడా మరొక కారణం. ఇప్పటి వర్తమాన కాలంలో ఆర్ఎస్ఎస్ లాంటి మతతత్వ శక్తులు పెరుగుతున్న కాలంలో ఇలాంటి ప్రగతిశీల కథలు రావడం చాలా ముఖ్యం. ఈ 'తెర వెనుక' నాటకంలో రచయిత్రి చాలా లౌక్యంగా ముస్లిం స్త్రీలు ముస్లిం సాంప్రదాయ పరదాల మాటున అనుభవిస్తున్న అన్ని రకాల అణిచివేతలను తెరలు తొలగిస్తూ పాఠకుల కళ్ళ ముందు అత్యంత సృజనాత్మకంగా ఉంచుతారు.

కావల్సినంత సంపద, గంపెడు పిల్లలున్నా ఆత్మహత్య ఆలోచనలతో – తీవ్రమైన కృంగుబాటుతనంతో ముప్పై ఏళ్లకే డెబ్బై ఏళ్ల దానిలా మారిపోయిన మొహమ్మదీ బేగంకి 17 ఏళ్లకు జరిగిన బాల్య వివాహం తర్వాతి క్రూరమైన దాంపత్య జీవితం... విలువలు లేని దిగజారిన భర్త... నిత్య గర్భాలతో వచ్చిన

రక్తహీనతతో పాడైన ఆరోగ్యంతో ఉన్న మొహమ్మద్ బేగంకి... ఆఫ్తాబ్ బేగంకి మధ్య సంభాషణలో చర్చిస్తారు.

ప్రతీ ఏడూ ఒక బిడ్డను కంటూ ఉండడమే కాదు, భర్త కొడితే ఆమె పళ్ళు కొన్ని రాలి వాటి మధ్య సందు ఏర్పడి దుర్వాసన వస్తుంటే అసహ్యించుకునే భర్తతో ప్రతీ సంవత్సరం పుట్టే పిల్లలు తల్లి పాలు లేక పోషకాహార లోపంతో బలహీనంగా ఉంటారు. కారణం ఆమె భర్త ఆమెను పిల్లలకు పాలివ్వడాన్ని అందం చెడుతుందని ఒప్పుకోడు. దానివల్ల ఆమెలో ఆకర్షణ పోతే తాను పరాయి స్త్రీల దగ్గరకు వెళ్లాల్సి వస్తుందని. పైగా భార్యని అతను నిత్యం తన లైంగిక కోరికలు తీర్చే ఒక వస్తువుగా చూస్తాడు. ఆమెను బెదిరిస్తూ అనుభవిస్తుంటాడు. పిల్లల పెంపకంలో భార్య తన కోరికలు తీర్చడం లేదని అతను పిల్లల కోసం నర్సుల్ని పెడతాడు. అందులో ఒక నర్సుకున్న చర్మ వ్యాధి నాలుగు నెలల బాబుకి అంటుకుని చనిపోతాడు. అది మొహమ్మద్ బేగంను కృంగదీస్తుంది. అధిక సంతానం ఉన్న స్త్రీలలో... పిల్లల్లో ఖచ్చితంగా పోషకాహార లోపం ఉంటుంది. డాక్టరుగా రషీద్ జహాన్ ఈ విషయాన్ని పలుమార్లు ప్రస్తావిస్తుంది. మధ్య మధ్యలో మొహమ్మదీ బేగం సంపదని, ఆమె భర్తనీ సమర్థిస్తున్న ఆఫ్తాబ్ బేగం కూడా జంతువుల్లో సెక్స్ కోరికలకు ఒక రుతువు ఉంటుందనీ మగవాళ్లకు అది ఉండదని జంతువుల కంటే మగాళ్లు అధ్వాన్నమనీ వీళ్ల నుంచి స్త్రీలను ఇంటా బయటా ఎవరు కాపాడాలని వాపోతుంది.

రెండు నెలల గర్భంలో తనకు $102^{0}$F డిగ్రీల జ్వరం ఉన్నా... మీద పడి సెక్స్ కోరికలు తీర్చుకుంటాడని మొహమ్మదీ బేగం చెప్పినప్పుడు డాక్టర్ కూడా ఆశ్చర్యపోయింది. ఇది చాలా వాస్తవం. చాలా మంది భర్తలు భార్య నెలసరితో ఉన్నా, గర్భంతో ఉన్నా, బాలింత అయినా, ఆపరేషన్లు జరిగి వారమే అయినా, జ్వరంతో ఉన్నా, ఫిజికల్లీ హాండీకాప్ అయినా పట్టించుకోకుండా నిర్దాక్షిణ్యంగా ఏం కాదులే అంటూ తమ సెక్స్ కోరికలు తీర్చుకుంటారు. భార్య ఆరోగ్యం కన్నా మగాళ్లకి ఆకలి, కోరికలే ముఖ్యమని, తాను క్రిస్టియన్ మతంలో పుట్టి వుంటే బాగుండేదని కన్నీటితో వాపోతుంది. క్రిస్టియన్ మతంలో కుటుంబ నియంత్రణ

ఆపరేషన్‌న్ని సమర్థిస్తారని మొహమ్మద్ బేగంకి తెలుసు. అదే సమయంలో క్రిస్టియన్ అమ్మాయిని ప్రేమించి పెళ్లి చేసుకున్న కొడుకుని ఆఫ్తాబ్ బేగం ద్వేషిస్తుంది. సమాధి దగ్గర దీపం కూడా పెట్టనివ్వని మత సంకరణ చేసిన వాళ్లకు పిల్లలు పుట్టకూడదని శాపాలు పెడుతుంది.

ఇందులో పురుషుడి లైంగిక అరాచకత్వాన్ని ఇస్లామిక్ చట్టంలో మతం ఇచ్చిన బహు భార్య వెసులుబాటుని కూడా రజియా పాత్ర ద్వారా చర్చకు పెడ్తుంది.

ఇంటికి వచ్చిన రజియా మీద కన్నేసి ఆ పిల్లని తనకిచ్చి పెళ్లి చేయమని వేధిస్తున్న భర్తను ఛీదరించుకుని మామయ్యలతో చెప్పి రజియాకి నిఖా చేయిస్తుంది మొహమ్మదీ బేగం.

అప్పట్నించీ మొహమ్మదీ బేగంను తనకెలాగైనా రెండో పెళ్ళి చేయమని, ఇస్లామిక్ చట్టం బహు భార్యాత్వాన్ని ఒప్పుకుంటుందని భార్యని వేధించడం వలన ఆమె తీవ్రమైన వేదనకు గురి అవుతుంది. రజియాకు ఆమె భర్త బూతులతో రాసిన ప్రేమ లేఖ ఆమెను కలవర పరుస్తుంది. ఈ నాటకంలో డాక్టర్ రషీద్ జహాన్ చర్చించిన మరొక ముఖ్యమైన విషయం – భర్తల ఆనందం కోసం స్త్రీలు తమ శరీర అవయవాల నిర్మాణాలని సర్జరీల ద్వారా మార్చుకోవడం వెనకాల ఉన్న భర్తల లైంగిక విచ్చలవిడితనం, అది సృష్టించే అబద్రత, భయాలు.

ఎక్కువ పిల్లలున్న స్త్రీలు తమ యోని వదులై భర్తలు ఎక్కడ అసంతృప్తితో పరాయి స్త్రీల వద్దకు వెళతారో అన్న భయంతో వెజైనాని కుట్లతో బిగుతుగా చేయించుకుంటారు. ఇది అన్ని మతాల్లో ఉంది. కాన్పు జరిగాక 'ఆరో కుట్టు' వెజైనా ప్లాస్టీ చేయమని డాక్టర్లతో భర్తలు బేరం కుదుర్చుకుంటారు. ఇదొక వ్యాపారంగా మారింది. రొమ్మలు బిగువుగా ఉండాలని – రొమ్ములు పెద్ద సైజులోకి మార్చడానికి ప్రమాదకరమైన సిలికాను ద్రవాన్ని రొమ్ముల్లో నింపుకుని కాన్సర్‌తో చనిపోయే స్త్రీలు, బ్రెస్ట్ లిఫ్ట్ చేయించుకునే వాళ్లు – సెక్స్ హార్మోన్లు తీసుకునే వాళ్లు ఎందరో. మొహమ్మదీ బేగం కూడా యోని బిగుతుగా చేస్కునే సర్జరీ, ఆరో కుట్టు ద్వారా లేదా వెజైనో ప్లాస్టీ ద్వారా చేయించుకుంటుంది. ఈ సబ్జెక్టును నేను 2018లో హస్బెండ్

స్టిచ్ – 2020లో స్టోమా కథలుగా రాసాను. భర్తలని సంతృప్తి పరచడానికి పరాయి స్త్రీల దగ్గరకి పోకుండా ఉండడానికి తమ శరీర కొలతలను – నిర్మాణాలను మార్చుకుని దుష్ఫలితాలకి బాధలు పడ్డం. 1930ల ముందు నుంచే డాక్టర్ రషీద్ జహాన్ గమనించి – సాహితీకరించడం చాలా గొప్ప విషయం.

ఈ సర్జరీల విషయం మొహమ్మదీ బేగంతో "ప్రతీ సంవత్సరం వర్సగా పిల్లల్ని కనే ఆడదాని శరీరం ఎంతకాలమని బిగుతుగా ఉంటుంది చెప్పు? మళ్లీ జారిపోతుంది. వదులై పోతుంది... అప్పుడు మళ్లీ బలవంతపు బెదిరింపులతో రోజూ హత్య చేయబడతాను – మాటలతో వధించబడతాను" అంటూ చెప్పిస్తారు డాక్టర్ రషీద్ జహాన్.

ఖురానులో భర్తకు సహకరించని భార్య ఎలా చిత్రహింసల నరకానికి గురి అవుతుందో చెప్తూ తనకు రెండో పెళ్ళి చేయకపోతే నువ్వూ నరకం అనుభవిస్తావు అంటూ భార్య మొహమ్మదీ బేగంను బెదిరిస్తాడు. నిజానికి ఖురాన్ హదీస్లలో ఎన్నో ప్రగతిశీల అంశాలున్నాయి స్త్రీలకి సంబంధించి ఉదాహరణకి, హింసించే, తాగుబోతులైన భర్తలకు స్త్రీలే ఖులా – విడాకులు ఇచ్చే వెసులుబాటు ఉంది ఖురానులో.

డాక్టర్ రషీద్ జహాన్ నాటకంలో, కథల్లో ముస్లిం సమాజపు వాస్తవికత కన్పిస్తుంది. ఎక్కడా రొమాంటిసైజ్ చేయడం కనపడదు. ఇతర మతాల్లో ఉన్నట్లే ముస్లిం సమాజంలో స్త్రీ పురుష అసమాన సంబంధాల్లో ఉండే అమానవీయతను, వాళ్లమీద అమలవుతున్న సాంప్రదాయాల్లో... మతాచారాల్లో వెతుకుతూ వాటిని రాజకీయార్థిక, సామాజిక కోణాలలో చర్చకు పెట్టారు. నాటకంలో మొహమ్మదీ బేగం కూతురు 12 ఏళ్ళ సబీనా కూడా నిత్య గర్భిణీ ఆయన తల్లిని చూస్తూ తన నిఖా ప్రస్తావన వచ్చినప్పుడు దిగులు, భయపు చూపులు చూస్తుంది. నమాజుకు తప్ప ఇంట్లో కనపడని భర్తపై ఆఫ్తాబ్ బేగంకి కోపం ఉంటుంది. రజియా – స్వంత మేనమామతో సెక్సువల్ అబ్యూస్‌కి గురి అవుతుంది. రజియా కోసం ఆమె తల్లిదండ్రులు పోరాడుతారు. ప్రతీ స్త్రీ పురుషాధిక్య సమాజంతో చేస్తున్న పోరాటాలు,

సర్దుబాట్లు ఈ నాటకంలో కనిపిస్తాయి.

ఇలా నాటకం అంతా కూడా మత, పితృస్వామ్య అణిచివేతతో స్త్రీలు ఘర్షణపడే పాత్రలే కనిపిస్తాయి.

ఆఫ్తాబ్ బేగంతో రచయిత సమాజంలో ఏదో మార్పు జరగబోతున్న సూచనలు కన్పిస్తున్నాయని అందుకే రజియాపై కన్నేసిన మొహమ్మదీ బేగం భర్తని తిట్టి రజియాకు వెంటనే మంచి కుర్రాణ్ణి చూసి పెళ్ళి చేసిందని ఇది కొత్త తరం – కొత్త కాలం అని వ్యాఖ్యానం చేయిస్తారు. ఎక్కడో పురుషుల ఆధిపత్యాన్ని అంగీకరించే స్వభావం ఉన్న ఆఫ్తాబ్ బేగం కూడా మొహమ్మదీ బేగం భర్త రెండో పెళ్ళి చేయమని భార్యని వేధించడం ఎంత క్రూరమని అసహ్యించుకుంటుంది.

మొహమ్మదీ బేగం తాను ఎదిరించలేని నిస్సహాయతలోకి వెళ్లినా తనకు రెండో పెళ్లి చేయమని వేధిస్తున్న భర్తతో తీవ్రంగా ఘర్షణ పడుతుంది. ఎదిరిస్తుంది. రజియాకి మామయ్యలతో చెప్పి వెంటనే పెళ్లి చేయించి భర్త నుంచి రక్షిస్తుంది. మరో పక్క ఆప్తాబ్ బేగం అన్నింటిలో పురుషులదే పై చేయి అని నిరాశ పడ్తుంది. తమ బిడ్డపై సెక్సువల్ అబ్యూస్ చేస్తే రజియా తల్లిదండ్రలు ఆగ్రహంతో మొహమ్మదీ బేగం భర్తని ప్రశ్నిస్తారు, అసహ్యించుకుంటారు వెంటనే పెళ్లి చేసేస్తారు.

మత, పితృస్వామ్య అణిచివేతతో ఇలా నాటకం అంతా కూడా ఘర్షణ పడే స్త్రీల పాత్రలే ఉంటాయి. వారి లైంగిక ఆరోగ్య చర్చలుంటాయి. డాక్టర్ రషీద్ జహాన్ కమ్యూనిస్ట్, మార్క్సిస్ట్ మేధావి కాబట్టి పాత్రల్ని ఘర్షణ పడ్తూనే సమస్యలను పరిష్కరించుకుంటూ ముందుకు కదిలిపోయే సజీవ పాత్రలని, సమాజపు వాస్తవానికి దగ్గరగా ఉండే పాత్రల్ని సృష్టించారు. లేదా తన కేస్ హిస్టరీలను యథాతథంగా చిత్రించగలిగారు.

డాక్టర్ గారు ఒక్క బురఖాలాంటి విషయాలే కాదు. ముస్లిం స్త్రీల మీద కుటుంబాల్లో జరిగే లైంగిక అణిచివేతను చర్చకు పెట్టారు. స్త్రీల వ్యక్తిగత జీవితాన్ని ప్రభావితం చేసే మతాన్ని సాంప్రదాయవాదాన్ని ఎదిరించడానికి ప్రత్యామ్నాయాలు చూపించారు.

డాక్టర్ రషీద్ జహాన్‌ను ఇప్పటి ప్రత్యామ్నాయ పరిష్కారాలను చూపించే ముస్లిం స్త్రీవాదులు ఫాతీమా మెర్నిసి, అమీనా వదూద్, లైలా అహ్మద్ లాంటి వారిలో పోల్చవచ్చును.

మొహమ్మదీ బేగం – ఆఫ్తాబ్ బేగంల మధ్య గంభీరమైన సైద్ధాంతిక చర్చలు ఏవీ ఉండవు వాస్తవిక పరిస్థితులను అత్యంత ఆవేశం, దు:ఖం, కన్నీళ్లతో చేసే భావోద్వేగ చర్చ మాత్రమే జరుగుతుంది. వాటిల్లోనే స్త్రీల పునరుత్పత్తి హక్కుల మీద, ఎంత మంది పిల్లల్ని కనాలన్న నిర్ణయాధికారం లేకపోవడం మీద, భర్తల లైంగిక అరాచక జీవితాలు లేదా బహు భార్యత్వం అనుమతించే ఇస్లామిక్ చట్టాల జిఖర్ ఉంటుంది. అందులోనే పరిష్కారం కూడా వెతుక్కుంటాయి ఈ స్త్రీల పాత్రలు. ఈ పాత్రల ద్వారా ముస్లిం సాంప్రదాయవాదుల ప్రవచనాలను కొట్టి పడేస్తారు డాక్టర్ రషీద్ జహాన్.

120 ఏళ్ల క్రితం ముస్లిం స్త్రీలు ఎదుర్కొన్న సమస్యలనే విచిత్రంగా వర్తమానంలో ఎదుర్కుంటున్నారు.

పెద్ద మార్పు లేదు. పెద్ద సంఘ సంస్కరణలు, ప్రగతి సాంస్కృతిక ఉద్యమాలు ముస్లింల కోసం అప్పుడూ ఇప్పుడూ జరగని చరిత్ర మనది. డాక్టర్ రషీద్ జహాన్ అప్పుడు రాసిన ముస్లిం సమాజపు రాజకీయ ఆర్థిక కుటుంబిక సమస్యలే 92 ఏళ్ల తర్వాత అంటే డాక్టర్ రషీద్ జహాన్ 120 జయంతి నాటి ఇప్పుడు సమాజంలో అలాగే చెక్కు చెదరకుండా ఉన్నాయి. ఇప్పటికీ ప్రపంచ వ్యాప్తంగా ఆఫ్రికన్ కంట్రీస్ నుంచి భారతదేశం దాకా స్త్రీలను పరిశుభ్రపరిచే యువతిగా మార్చే FGM (అంటే ఫీమేలం జెనైటల్ మ్యుటిలేషన్) స్త్రీల బాహ్య జననాంగాల విచ్ఛేదన ముఖ్యంగా స్త్రీలలో లైంగికానందాన్ని కలిగించే 'క్లైటోరిస్' అనే భాగాన్ని కత్తి %-% బ్లేడుతో, సీసం ముక్కతో నాటు పద్ధతుల్లో, ఇప్పుడు ఆధునిక శస్త్ర చికిత్స పద్ధతుల్లో అమలవుతూనే ఉంది దశాబ్దాలుగా. ఇది ఎక్కువగా 'బోహ్రా కమ్యూనిటీ'లో జరుగుతుంది. స్త్రీల లైంగిక కోరికల్ని అణిచివేసే క్రమంలో చేసే క్రూరమైన మతాచారం ఇది. దీనిపై నేను 2020లో 'ఖత్నా' అనే కథ రాసాను. ఇక ఇప్పటి ముస్లిం

సమాజం వర్తమానంలో ఎదుర్కొంటున్న క్రూరమైన సంఘటనలకి ఆర్ఎస్ఎస్ మతతత్వ శక్తులు ప్రధాన పాత్ర పోషిస్తున్నాయి. మెజారిటీ మతం అయిన హిందూ మతం ఫాసిస్ట్ ఆర్ఎస్ఎస్–బిజెపి పాలకులకు మతం ఒక రాజకీయాయుధం అయ్యింది. మతం రాజకీయమైంది. మతాధిపత్యమే రాజ్యంగా, రాజకీయ ఆయుధంగా మారిపోయి ప్రజల్లోకి ఓట్లు – పాలనాధికారమే లక్ష్యంగా పాలిస్తున్న సందర్భం ఇది.

ముస్లిం సమాజం ఇప్పుడు ఎదుర్కొనే ప్రధాన సమస్య భారత దేశంలో తమ అస్థిత్వాన్ని, దేశభక్తిని నిరూపించుకోవడమే... నిరూపించుకోలేకపోతే చావడమే! ముస్లిం స్త్రీలు ఇప్పుడు తమ స్వంత మతాచారాల సాంప్రదాయవాదుల ఆంక్షల అణిచివేతతో పాటు మెజారిటీ మతమైన హిందు మతతత్వ శక్తులతో పోరాడుతున్నారు. రాజ్యం చేస్తున్న ఫాసిస్టు దాడుల్లో ముస్లిం స్త్రీల మీద అనేక లైంగిక హత్యాచారాలు జరుగుతూనే ఉన్నాయి. గుజరాత్–2002 నుంచి ఇప్పటి 2024 వరకూ కొనసాగుతూనే ఉన్నాయి. రూపం మారిన మతతత్వ సమస్యలతో నిత్య పోరాటం చేస్తున్నది ముస్లిం సమాజం. వీటి ప్రభావం స్త్రీలు అనుభవిస్తున్నారు.

వీటన్నింటిని ఒక దానిలో ఒకటి విడిగా చూస్తూనే అన్నింటినీ కలిపి చూడ్డం చాలా అవసరం.

మతతత్వ శక్తుల హింసకి బాధితులు ఒక్క ముస్లింలే కాదు హిందువులు కూడా ఉన్నారు. ముస్లింలను ప్రేమించే లౌకిక శక్తులు వీటన్నింటిని హిందువుల మీద రాజ్యం బలవంతంగా మతాన్ని రుద్దుతోంది. ఆర్ఎస్ఎస్ ఇప్పుడు హిందూ స్త్రీలని కూడా ఐదుగురి పిల్లల్ని కనమంటుంది. రాత్రి తొమ్మిది దాటాక స్త్రీలు ఒంటరిగా బయట తిరగొద్దు. మగ తోడుతో తిరగాలి. ఉద్యోగాలు చేయకుండా భర్త ఇల్లు పిల్లల్ని చూస్కోవాలి అని ఆర్.ఎస్.ఎస్. శాసిస్తున్నది.

ఎన్నో ఉద్యమాలు చేసి సాధించుకున్న స్త్రీల హక్కులను కాలరాసే ప్రయత్నం స్టేట్ స్వయంగా ఫాసిస్ట్ పద్ధతుల్లో అమలు చేయాలని చూస్తున్నది. సిటిజన్ షిప్‌ను నిరూపించుకోలేని ముస్లింలను హింసించి చంపుతున్నది. భారత దేశం ముస్లింలకి

పరాయిదన్న భావన కలిగించడంలో సఫలమయ్యింది.

ఆరెస్సెస్ హిందువుల్లో ముస్లింలపై ఎంతటి ద్వేషాన్ని నింపడంలో పూర్తి సఫలీకృతం అయ్యింది.

ఏ కారణం లేకుండా చాలా మంది హిందువులు ముస్లింలను ద్వేషిస్తున్నారు.

డాక్టర్ రషీద్ జహాన్ ఈ కాలంలో ఉండి ఉంటే నిర్భీతిగా హిందూ మతతత్వ శక్తుల్ని ఎదిరించే ధిక్కార సాహిత్య సృజన చేసి ఉండేవారు.

ఇప్పటి కాలపు రచయితలపై ఈ హిందూ మతతత్వ ఫాసిజంకి బలైపోతున్న ముస్లిం సమాజానికి సాహిత్య సాంస్కృతిక మాధ్యమం ద్వారా పూర్తి భరోసా ఇవ్వాల్సిన అవసరం ఉంది.

డాక్టర్ రషీద్ జహాన్ 1952లో ఒవేరియన్ కాన్సర్‌తో మరణించకపోతే భారతదేశం ముస్లిం సమాజంలో జరిగిన రాజకీయార్థిక పరిణామాలన్నింటినీ ఎన్ని వందల కథల్లో రాసేవారో కదా అన్పిస్తుంది.

ముస్లిం స్త్రీల మీద బిజెపి మతతత్వ రాజ్యం చేసిన అకృత్యాలు అన్నీ ఇన్నీ కావు.

వీటి మీద మరెంతో సాహిత్యం రావాల్సి ఉంది. కానీ రచయితల్లో ఒక స్తబ్దత ఉంది.

కమ్యూనిస్టు రచయిత్రి అయిన డాక్టర్ రషీద్ జహాన్ బతికి ఉంటే ఈ వెలితి ఒక ముస్లిం రచయిత్రి ద్వారా పూడ్చబడి ఉండేది.

మతపు తెరల వెనక ఉన్న ముస్లిం సమాజపు వాస్తవికతను ఎంతో గొప్పగా ఆమె రాసి ఉండేది.

పైగా డాక్టర్ రషీద్ జహాన్ డాక్టర్ కావడం వలన తన స్త్రీ రోగుల శరీరాల్లోని రోగ క్రిములు కలిగించే వ్యాధుల్నే కాదు ... ప్రసవాలు చేస్తూ ఉండడమే కాదు వారి శారీరక రోగాలకు, నిత్య గర్భాల వెనక ఉన్న అసమ సమాజం మూలాల్లోకి వెళ్లి అర్థం చేస్కుని వాళ్లని తన హృదయంలోకి తీస్కుని రాసిందా ఈ నాటకం అనిపిస్తుంది. ప్రతీ గైనకాలజిస్టు స్త్రీల దేహాలను వారి

రోగాలను తమ మార్కెట్ ప్రయోగశాలగా డబ్బు సంపాదించే వస్తువుల్లా కాకుండా.. క్రూరమైన వ్యవస్థ మూలాల్లోకి తడిమి చూసి ఆ భార్యలను లైంగిక వస్తువులుగా, పిల్లల్ని కనే యంత్రాలుగా మాత్రమే చూసే భర్తలకి తీరిక చేస్కుని కౌన్సిలింగ్ ఇస్తే ఎంత బాగుంటుంది. హింస స్త్రీల మీద తగ్గుతుంది. అలాంటి ప్రగతిశీల గైనకాలజిస్టులు ఈ సమాజానికి చాలా అవసరం.

ఈ నాటకాన్ని చదివి స్ఫూర్తి చెంది దీన్ని తెలుగు పాఠకులకి పరిచయం చేయాలని అనువాదం చేసిన సామాజిక సాంస్కృతిక కార్యకర్త అయిన గౌరవ్‌కి నా ప్రత్యేక అభినందనలు. నాకు ఈ ముందుమాట రాసే గౌరవాన్ని ఇచ్చినందుకు గౌరవ్‌కి కృతజ్ఞతలు.

# తెర వెనుక....

**(తెల్లటి గచ్చు గల గది మధ్యలో పరుపు పరిచి ఉంటుంది. దాని మీద తలగడకి ఆనుకుని ఒక మహిళ కూర్చుని ఉంటుంది. ఆమె బాధగా, అలసటగా ఉంటుంది. పక్కన వెండి పళ్ళెంలో నీళ్ళు నింపిన పాత్ర ఉంటుంది. ఆమె ఎదురుగా 40 ఏళ్ళు గల మరో స్త్రీ కూర్చుని వక్క పలుకులు వలుస్తుంటుంది. ఒక వైపు తాంబూళం తయారీ కోసం దినుసుల పాత్ర, మరోవైపు ఉమ్మి పాత్ర ఉంటాయి. ఆ గదికి రెండు ద్వారాలు. గోడలకి అల్మారాలు, అరలు, వాటిల్లో వంట సామాగ్రి, చెంబులు, మూతలు ఇంకా అనేక వస్తువులు. గులాబీ రంగు గుడ్డ కట్టిన పంఖా ఒకటి పైన సరిగ్గా గది మధ్యలో వేలాడుతోంది. గదిలో ఒక మూల అలంకరించిన దుప్పటితో గల మంచం కనిపిస్తుంటుంది. మరో మూలన ఇంకో పరుపు దుప్పటి పర్చి పక్కన ఉమ్మితొట్టితో ఉంటుంది)**

మొహమ్మదీ బేగం: అక్కా, మన కోసం ఎవరు పట్టించుకుంటారు? చాలినంత జీవితం గడిచిపోయింది, ఇప్పుడిక మిగిలింది ఆ అల్లాయే చూసుకుంటాడు. ఈ ప్రపంచంతో నేను ఎంతగా విసిగిపోయానంటే ఈ చిన్న పిల్లల బాధ్యతే కనుక లేకుంటే ఇంత విషం పుచ్చుకునుండే దాన్ని.

అఫ్తాబ్ బేగం: ఎంటి చెల్లీ ఆ మాటలు? నీకేమయినా పిచ్చి పట్టిందా? ఆత్మహత్య గురించి ఆలోచించే వయసా ఇది. ఇప్పుడిప్పుడే నీ జీవితంలోకి వసంతం వచ్చింది. దేవుడి దయవల్ల పిల్లలు

ఎదిగారు. ఇలాంటి సమయంలో విషం గురించిన ఆలోచన అసలు నీకెలా వచ్చిందే. ఇలా నా వైపు చూసి చెప్పు....

మొహమ్మదీ బేగం: ఎందుకు చూడాలక్కా నీ వైపు? ఐనా దీనికి వయసుతో సంబంధం ఉంటుందని అనుకుంటున్నావా? వయసు మళ్ళీన వారికే ప్రపంచంపై విసుగొస్తుందా? నేను చూసినంత వరకూ జీవితంపై ఆశ యువతలో లాగానే ముసలి వాళ్ళల్లో కూడా ఉంటుంది. చావు అందరికీ వస్తుంది. నా చావు ఎక్కడుందో ఆ దేవుడికే తెలియాలి. తర్వాత పిల్లలతో సహా అంతా మర్చిపోతారు. జీవితం గాడినపడి ముందుకు సాగిపోతుంటుంది.

అఫ్తాబ్ బేగం: అలా మాట్లాడకు, ఓర్చుకో. కాస్త సంభాళించుకో. నువ్వింకా చిన్నదానివి. చావుకోసం ఎదురు చూసే వయసు కాదు నీది. నువ్వు నాకంటే పదేళ్ళు చిన్నదానివి. నువ్వు పుట్టిన ఏడే నా పెళ్ళి మాటలయ్యాయి. ఆ ఏడే రాణీ చనిపోయింది. నాకు బాగా జ్ఞాపకం ఉంది. ఆమె ఆత్మ శాంతించుగాక. నువ్వు పుట్టినప్పుడు చాచీ అమ్మ ఎంత సంతోషించిందో. 'ఈమె నాకు కొడుకులాంటిది' అని నీ గురించి అంటూండేది. పెళ్ళయిన 30 ఏళ్ళ తర్వాత నువ్వు పుట్టావు. ఏం సంబరాలు! తినడం, తాగడం, స్త్రీలంతా కల్సి నృత్యాలు చేయడం. అంతేనా నీ పెళ్ళి కూడా ఎంత వైభవంగా జరిగిందనీ! ఢిల్లీ నగరం అంతా ఆ ఉల్లాసం, ఉత్సాహం రెట్టించినట్టే కనిపించాయి. నీ అంత అదృష్టవంతురాలు ఎవరుంటారు చెప్పు? నేనెంత దురదృష్టవంతురాలినో చూడు. అల్లాహ్ కరుణ నీ మీద ఉంది. భర్తా, పిల్లలూ, ఇల్లూ వాకిలీ అన్నీ నీకున్నాయి.

మొహమ్మదీ బేగం: అవును, అది నిజం. భర్తా పిల్లలూ, ఇల్లూ వాకిలి ఇవన్నీ ఉన్నాయి. కానీ, యవ్వనం? ఎవరు నన్ను యువతిగా

పిలుస్తారు? నేను డెబ్బై సంవత్సరాల ముసలమ్మలా కనబడుతున్నాను. ఈ దీర్ఘకాలిక వ్యాధికి హకీములు, వైద్యులు రోజూ వస్తూనే ఉన్నారు. మళ్ళీ ప్రతీ ఏడూ ఒక బిడ్డ! నిజమే, నా అంత అదృష్టం ఎవరికీ పట్టద్దూ మరి? (ఆమె కళ్ళు నీటితో నిండిపోయాయి. ఆమె రూమాలుతో కళ్ళు తుడుచుకుని ఉమ్మి తొట్టిలో ఉమ్మి మళ్ళీ మాట్లాడటం మొదలెట్టింది) రెండు నెలల క్రితమే ఇది జరిగింది. గర్భం పోయాక లేడీ డాక్టర్‌ని డా. గాయా పిలిచారు. నా లోపల అనారోగ్యం వలనే తరచుగా జ్వరం వస్తోందని ఆమె అంది. ఆమె ద్వారా ఆ సమస్య ఏమిటో తెల్సుకోవాలనీ ఆయన అనుకున్నారు. అప్పుడా లేడీ డాక్టరు నా వయసెంతని అడిగింది. 32 సంవత్సరాలు అని చెప్పాను. నమ్మలేనట్టు నవ్విందావె. అప్పుడు నేనన్నాను "మీరెందుకు నవ్వుతున్నారు? 17 ఏళ్ళకే నాకు పెళ్ళయిన విషయం మీకు తెలుసు. నాటి నుండి నా భర్త విదేశాలకు వెళ్ళినప్పుడు తప్పితే ప్రతీ సంవత్సరం నేను బిడ్డను కంటూనే ఉన్నాను. రెండోసారి ఆయనా, నేనూ గొడవలు పడ్డాం. ఇదిగో ఇక్కడ నా పళ్ళ మధ్య ఖాళీలున్నాయే. అక్కడి దంతాలు మా ఆయన లాగేసాడు. అదిగో అప్పుడే అదేదో, దేవుడికే తెలియాలి ఆ పేరు, ఆ వ్యాధి పట్టుకుంది. ఇప్పుడు సమస్య ఏమిటంటే విదేశాల నుండి విచ్చేసిన నా ప్రియమయిన భర్తకి నా నోట్లోంచి దుర్వాసన వస్తోందట" పాపం ఆ డాక్టర్ మట్టుకు ఏం చేస్తుంది? నవ్వి ఊరుకుంది.

అఫ్తాబ్ బేగం: నువ్వన్నీ ఇలాంటి పిచ్చి మాటలే చెబుతుంటావు. జనం మరి నవ్వకుండా ఏం చేస్తారు?

మొహమ్మదీ బేగం: ఏదైతేనేం, ఆ లేడీ డాక్టర్ నా కడుపు, గుండెలు మళ్ళీ నా లోపల పరిశీలించి అంది, 'బేగమ్ సాహెబా, మీరు మళ్ళీ

గర్భవతయ్యారేమో, రెండు నెలలు'. అంతే, నా గుండె ఒక్క క్షణం ఆగిపోయింది. పోరాడటానికి మరో సమస్య. (సరిగ్గా అప్పుడే పిల్లలు కీచులాడుకుని ఏడుస్తున్న గొంతులు పక్క గదిలోంచి వినబడతాయి. పరుపు మీద కూర్చొన్న బేగం సాహెబా ఒకసారి లేచి కేకలేసి అరిచి మళ్ళీ సర్దుకుని కూచుంటుంది) ఓరి పిడుగుల్లారా! ఒక్క నిమిషం ప్రశాంతంగా ఉండరు కదా. హేమాహేమీల్లాంటి ఎంత మంది పని మనుషులు ఉంటేనేం, ఆ దేవుడు నన్ను త్వరగా తన దగ్గరకి తీసుకుపోయి, లోకంలోని బాధల్నుంచి విముక్తి కలిగిస్తే చాలు. (పక్క గది తలుపులు తెరుచుకుంటాయి. శుభ్రమయిన బట్టలు వేసుకున్న ఇద్దరు పని మనుషులు ఏడుస్తున్న చెరో బిడ్డనీ ఎత్తుకుని తీసుకు వస్తారు. కొద్దిగా పెద్ద పిల్లలు తలుపు దగ్గర తచ్చాడుతూ కనబడతారు. పిల్లలంతా పీక్కుపోయి సన్నగా పీలగా తక్కువ బరువుతో ఉంటారు. తలుపు తీయటం వల్ల లోపలి ప్రాంగణం కనిపిస్తూ ఉంటుంది).

మొదటి పనిమనిషి: బేగం సాహిబా, నన్హీమీయా చెప్పిన మాటసలు వినట్లేదు. గదిలోకొచ్చి మిగిలిన పిల్లలందర్నీ అల్లరి పెడుతున్నాడు. వాళ్ళని సరిగా ఆడుకోనివ్వడం లేదు. ఇప్పుడేమో నన్హేబీ బొమ్మా, ఛోటేమియా బంతీ తీసుకుని పారిపోయాడు. పెద్దవాళ్ళ గదుల్లోకి దూరుతున్నాడు.

మొహమ్మదీ బేగం: (కోపంగా) వాడో వెధవ. ఇంట్లో ఎవరనీ ప్రశాంతంగా ఉండనివ్వడు. తండ్రిలానే కొడుకు కూడా. (బిడ్డని చేతిలోకి తీసుకుని నిద్రబుచ్చుతుంది. పెట్టెలోంచి ఏదో తీసి తినడానికి ఇద్దరు బిడ్డలకి ఇస్తుంది) సరే, వెళ్ళండిక. ఉదయం నుండి సాయంత్రం దాకా నాకు వినబడేవి అరుపులు, కేకలే

(కాసేపు ఆగి, పని మనుషులు వెళ్ళిపోయిన గది వైపు చూసి అరుస్తూ) అరే! కనీసం ఆ గది తలుపులు వేయండి. ఉదయం నుండి ఇదే విషయం ఎన్నిసార్లో చెప్పాను! వీళ్ళెప్పుడు ఇవతలకి వచ్చినా తలుపులు తెరిచి ఉంచేస్తారు.

అఫ్తాబ్ బేగం: చెల్లీ! ఆ దిక్కుమాలిన డాక్టరు మీ ఇంటికి వస్తూనే ఉంటారు. ఐనా చూడు, పిల్లలెంత పీలగా, బేలగా పోషకాహార లోపంతో ఉన్నారో.

మొహమ్మదీ బేగం: తల్లిపాలు లేని బిడ్డలు ఇంకెలా ఉంటారు మరి? రకరకాల నర్సుల్ని తీసుకువస్తారు ఇంటికి. నిర్ణయం నా భర్తదే. ఆయనకేమో డబ్బుంది, నన్నీ విషయాల్లో కలుగజేసుకో వద్దంటాడు. అతడికి తన సుఖసంతోషాలే ముఖ్యం. ఎవరైనా బిడ్డ నా దగ్గర ఉండటమే అతగాడికి అసౌకర్యం. అది పగలా రాత్రా అనేది పట్టదు. అతనికి కావాల్సిందల్లా భార్య ఎల్లవేళలా అందుబాటులో ఉండటం. అలాగని భార్యతో ఆగుతాడా అంటే అదేం లేదు. ఇతరేతర బయటి చోట్లకి ఆగకుండా వెళుతూనే ఉంటాడు.

అఫ్తాబ్ బేగం: మొహమ్మదీ బేగం, నువ్వు పాపం అమాయకుడయిన నీ భర్తని ప్రతిదానికీ తప్పు పడుతూనే ఉంటావు. పనివాళ్ళని పెడితే అతనో క్రూరుడు లేదంటే వెధవ. అల్లాహ్ పేరు తల్చుకో.

మొహమ్మదీ బేగం: అక్కా నజీర్ చనిపోయినప్పుడు నువ్విక్కడ లేవు. నా చిన్న బాబుకి నాలుగు నెలలకే నూరేళ్ళు నిండాయి. అల్లాహ్ మన శత్రువులకి కూడా అలాంటి పరిస్థితి రానివ్వద్దు; అపరిచితులు కూడా వాడి బాధ చూసి అల్లాడిపోయేవారు. వాడి కోసం పెట్టిన నర్సు చూట్టానికి ఎత్తుగా బలంగా ఉండేదే కాని ఆమెకి లోపలేవో రోగాలు ఉండేవి. ఆ విషయం ఎలా తెలుస్తుంది? దానివల్ల బాబు ఒంటి మీద

పుండ్లు లేచాయి. అవి పగిలి పచ్చి మాంసం వెలుపలికి వచ్చేది. వాడి ఒళ్ళంతా చీము పట్టేసింది. డాక్టర్ గయాస్ వాట్ని పిండుతుంటే నేను పరదా వెనక నుండి చూసేదాన్ని. అలా చీము బయటకు పోయి రెండు మాసాలకి వాడు కన్ను మూసాడు. తర్వాత మళ్ళీ నేను ముగ్గుర్ని కన్నాను. వాళ్ళకి పాలిస్తానని పట్టుబట్టేదాన్ని, కానీ ఎవరు వింటారు? పైగా నన్ను బెదిరించేవాడు, "పిల్లలకి కనుక రొమ్ము పాలిస్తే నేను మరో పెళ్ళి చేసుకుంటాను. నాకంటూ ఎల్లవేళలా ఒక స్త్రీ కావాలి. నువ్వు నీ పిల్లల బాగోగులు చూసుకుంటూ కూర్చుంటే నేను వేచి ఉండలేను" అంటూ భయపెట్టేవాడు.

అఫ్తాబ్ బేగం: అదీ సమస్య. ఇదంతా నాకెలా తెలుస్తుంది. ఇలాంటి మగాళ్ళ నుండి దేవుడు మనల్ని కాపాడుగాక. జంతువులకయినా కొంత నిగ్రహం, కొన్ని హద్దులు ఉంటాయి. వీళ్ళు జంతువుల కంటే అధ్వాన్నం. ఇలాంటి మగాళ్ళ నుండి రక్షింపబడుగాక. గతంలో ఇలా జరిగేది కాదు. కానీ, ఇప్పుడు ఈ మగాళ్ళంతా ఇలాగే దుర్మార్గంగా తయారయ్యారు. మీ బావగారినే చూడు. ఇంత వయసు వచ్చినా కుర్రాడిలా మితిమీరి ప్రవర్తిస్తారు. (నవ్వుతూ) ఒట్టేసి చెబుతున్నాను, ఆయన చేత గంటలకొద్దీ నా పాదాలు నొక్కించుకుంటాను.

మొహమ్మదీ బేగం: (సైగలతో) ఎవరి ఖర్మ వారిది. నీ మాటలు వింటూంటే ఆ లేడీ డాక్టర్‌తో జరిగిన సంభాషణ మళ్ళీ గుర్తొచ్చింది. నేను రెండు నెలలు గర్భవతిగా ఉండగా డాక్టర్ ఆశ్చర్యంతో, "బేగం సాహెబా, గత 4 నెలలుగా మీరు మంచానికే పరిమితం అయ్యారనీ, ప్రతి రోజూ సాయంత్రం జ్వరం వస్తోందని చెబుతున్నారు. డాక్టర్ గయాస్ కూడా ప్రతీ రోజూ సాయంత్రం మీకు వంద నుండి నూటొకటి దాకా ద్వరం

ఉంటోందని అంటున్నారు. కానీ, మరి...” నేనన్నాను, “మిస్ సాహెబ్, నువ్వు అదృష్టవంతురాలివి. నువ్వు నీకంటూ డబ్బు సంపాదిస్తావు, నచ్చినట్టు ఖర్చు పెట్టగలవు. కాబట్టి, హాయిగా, ప్రశాంతంగా నిద్రపోగలవు. నా సంగతంటావా? నేను స్వర్గంలోకి పోతానో, నరకానికే పోతానో ఎవరికి కావాలి? వాళ్ళకి కావాల్సినది వాళ్ళ సుఖం, సంతోషం మాత్రమే. దౌర్భాగ్యురాలయిన భార్య ఉంటే ఎంత పోతే ఎంత? ఎవరు పట్టించుకుంటారు. మగాళ్ళందరికీ వాళ్ళ ఆకలి, కోరికలే ప్రధానం.” పాపం ఆ లేడీ డాక్టర్ మౌనంగా అంతా వింది. తర్వాత ఆమె అంది, “నువ్వు చాలా జబ్బుగా ఉన్నావు.” అక్కా, ఈమె ఒక్కరే కాదు, చూసెళ్ళిన డాక్టర్లంతా, నేను అంత బలహీనంగా ఉన్నప్పుడు బిడ్డలు బలంగా, ఆరోగ్యంగా ఉండలేరనే అన్నారు. ఇది చాలదన్నట్లు పిల్లలంతా రాసుకు పూసుకు తిరిగేవారు. ఎవరైనా ఏం చేస్తాం? క్రైస్తవులుగా పుట్టినా బావుండేది.

అఫ్తాబ్ బేగం : అయ్యో అయ్యో, అలాంటి దైవదూషణ పలుకులు పలకకు. నాకు ఒక్కడే కొడుకు. వాడు కూడా ఒక కిరస్తానీ అమ్మాయితో ఉంటున్నాడు. వాడి పెళ్ళి కోసం నేను ఎన్ని కలలు కన్నాననీ. మా తమ్ముడది సహించలేక వహీదా పెళ్ళి వేరేచోట ఖాయం చేసుకున్నాడు. నా హృదయమెంత దుఃఖిస్తుందో తెలుసా. నా గుండెలెలా మండుతున్నాయో ఊహించగలవా. ఏ అమ్మాయినైతే కోడలిగా తీసుకు రావాలని ఆమె చిన్నప్పటి నుండి నిశ్చయించుకున్నానో ఆమె పరాయి ఇంటికి వెళుతోంది. దీనికంటే వాడసలు పుట్టకుండా ఉన్నా బావుండేది. వాడిక బతికున్నా చనిపోయినట్టే లెక్క నాకు.

మొహమ్మదీ బేగం: అతడ్ని శాపనార్ధాలు ఎలా పెట్టగలవు? ఈ పెద్ద వయసులో

అతడే నీకు దిక్కు. ఏదేమయినా తాను మారుతాడు. కాస్త ముందూ, వెనక అంతే.

అఫ్తాబ్ బేగం: ఏం మార్పు? వాడెప్పటికీ మారడు. రెండేళ్ళ నుండి నేను నెత్తీనోరూ మొత్తుకుంటున్నా వీసమెత్తు మార్పు కూడా వాడిలో కలగలేదు. ఇదే నగరంలో ఉంటూ ఒక్కసారి కూడా వాడు ఇంట్లో అడుగు పెట్టలేదు. వాడిప్పుడు నెలకి నూట యాభై రూపాయలు సంపాదిస్తున్నాడట. దేవుడి దయవల్ల ఇంకా పిల్లలు లేరు. ఇప్పుడిక నాది ఒకటే కోరిక. నేను పోయాక నా సమాధి దగ్గర దీపం ఎవరూ వెలిగించక పోయినా సరే, వాడి భార్య, ఆ పాపిష్టిది మాత్రం దాని యవ్వనంలోనే పిల్లలు కలగకుండా పోవాలి. నా బాధ ఎవరితో చెప్పుకోను? తీరని బాధలతో, వ్యధలతో మన జీవితాలు నిండిపోయాయి. మొహమ్మదీ బేగం, ఈ వార్త విన్నావా? మిర్జా మక్బూల్ అలీషాకి మళ్ళీ పెళ్ళయింది. ఇద్దరు భార్యలు మరణించారు. అతగాడి మనవరాళ్ళకి కూడా పిల్లలున్నారు. ఇప్పుడు పెళ్ళి చేసుకున్నామె. వయసులో ఉంది, అమాయకపు మొహం. మహా ఐతే 20 ఏళ్ళుంటాయేమో. ఆ దురదృష్టవతి జీవితం నాశన మయ్యింది. ఆమెకి ఇంకా పెళ్ళి కావాల్సిన ఆరుగురు చెల్లెళ్ళు ఉన్నారట. పాపం అందుకే ఆ పేద తల్లిదండ్రులు... (12 ఏళ్ళ కొడుకు పైజామా వేసుకుని గది తలుపు తోసుకుని పరిగెడతాడు. ఒక చేతిలో దారం చుట్ట, మరో చేతిలో కత్తెర ఉంటాయి. ఆ వెనకే బలంగా పైజామా వేసుకున్న అమ్మాయి వస్తుంది.)

అమ్మాయి: అమ్మా, ఈ బడే మియా అస్సలు మాట వినట్లేదు. చూడు నా పైజామా ఎలా కత్తిరించాడో, కొత్త పైజామా (చెబుతూ కుర్తా తీసి చూపిస్తుంది) నేను వాడితో అసలు మాట్లాడ్డమే

లేదు. అబ్బాజాన్ బట్టలకి గుండీలు కుడుతుంటే, చూడు వచ్చి నా దుప్పటి ఎలా చింపేసాడో. (చెబుతూ గోడకు ఆనుకుని ఏడవడం ప్రారంభిస్తుంది).

అబ్బాయి : (అక్కని అనుకరిస్తూ) అవ్వ, అవ్వ, అవ్వ, నువ్వేం చేసావో మాత్రం నిజం చెప్పడం లేదు. ఐతే, నువ్వు సూదీ దారంతో కుడుతున్నావా? నువ్వెలాంటి చెత్త పుస్తకాలు చదూతున్నావో అమ్మతో చెప్పనా? హృదయంలో నిండిన ప్రియతమా? అందమైన నేస్తం?

అమ్మాయి : (అబ్బాయి వైపు తిరిగి) దేవుడి మీద ప్రయాణం చేయి, అబద్ధం చెప్పకు. దేవుడి మీద ఆన. అమ్మ, నేను మళ్ళీ అష్రఫ్ ఆలీ సాహెబ్ గారి బహిష్టి జవార్ చదుతున్నాను. దానిని చూపించమని వీడు గొడవ చేసాడు. నేను చూపించకపోయే సరికి నా పైజామా చించేసాడు. నువ్వెప్పుడు వీడ్ని ఏమీ అనవు.

మొహమ్మదీ బేగం: (నుదుటన చేతితో కొట్టుకుంటూ) శభాష్ బేటీ! ఈ తల్లి ఉన్నా పోయినా కొద్దిగా సాయం చేద్దామనే ఆలోచన నీకు రాదు. పైగా నీకంటే చిన్న వాళ్ళతో గొడవపడి తగువులాడుతూ ఉంటావు. (తర్వాత కొడుకు వైపు తిరిగి) ఈ రౌడి వెధవ ఎప్పుడూ ఎవరోకర్ని ఇబ్బంది పెడుతూనే ఉంటాడు. అవతలికి ఫో.

అఫ్తాబ్ బేగం: ఇలా రా మియా. ఆ కత్తెర ఇలా ఇచ్చెయి. చెల్లిని ఎవరైనా ఇలా ఏడిపిస్తారా చెప్పు? ఇంతా చేసి ఆమె నీతో ఉండేది కొంత కాలమే. తనకి ఏడాది రెండేళ్ళలో పెళ్ళై వెళ్ళిపోతుంది. తర్వాత నువ్వు ఎంత బెంగ పెట్టుకుని కావాలన్నా ఆమెని చూడలేవు. (ఈ మాటలతో సబీనా తత్తరపడి దిగులుగా కిందికి జారి తలొంచుకుంటుంది. బడే మియా పరుపు పైకి దూకి దానిని గుర్రంలా భావించి

లాగుతూ కొద్ది సేపటి వరకూ పైకి కిందికి ఆడుకుంటాడు.)

అబ్బాయి: మరలా అయితే, ఆమె నాకు పుస్తకం ఎందుకు చూపించలేదు?

మొహమ్మదీ బేగం: బడే మియా! దేవుడి పేరు మీద కనీసం సిగ్గుపడు. నా ప్రాణాలిలా తోడేయకు. నా హృదయం, దేహం బండబారిపోయాయి. మీ నాన్న దగ్గరకు పో. మౌల్వీ సాహెబ్ వచ్చే సమయమయ్యింది. నీ పాఠాలు పూర్తయ్యాయా? (చదువు ప్రసక్తి ఎప్పుడైతే వచ్చిందో బడే మియా అక్కడ్నుంచి వెళ్ళిపోవడమే మంచిదనుకుని జారిపోయాడు)

అఫ్తాబ్ బేగం: ఇంతమంది పిల్లలతో ఇల్లు కళకళలాడుతూ నిండుగా కనిపిస్తుంది. కానీ గోల, అరుపులు, కల్లోరం మాత్రం భరించలేం బాబు, తల ప్రాణం తోక్కోస్తుంది. నేనిప్పుడు ఇంట్లో ఖాళీగా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటున్నాను. మా ఆయన నమాజ్ కోసం మాత్రమే ఇంటికి వస్తున్నాడు. ఒకట్రెండు క్షణాలు మాత్రమే ఉండి ఆయన మళ్ళీ ముందు గదిలోకి వెళ్ళి కూర్చుంటాడు. దేవుడా, దయచేసి నాలాంటి ఒంటరి జీవితం ఎవరికీ ఇవ్వకు. (ఇంతలో గది తలుపు తెరుచుకుని కోలాన్ అనబడే ముసలి మనిషి చేతులతో ఏదో పట్టుకుని వస్తుంది.)

కోలాన్: సలామ్ బేగం సాహెబ్, సలామ్ బడీ బేగమ్. ఇదిగో ఇది తీసుకోండి. నేను నా వంతుతో ఇంటికి వెళ్ళిపోవాలి. బేగం, ఎలా ఉన్నారు? పిల్లలెలా ఉన్నారు?

మొహమ్మదీ బేగం: ఏదోలే అత్తా, ఇలా గడిచిపోతోంది. వదిన బాగానే ఉందనుకుంటాను. పిల్లలు అంతా బాగే కదా. కొత్తగా పుట్టిన మనవడికి నా శుభాకాంక్షలు. ఇది పంజిరీ (ఒక రకమైన తీపి వంటకం – అను) అనుకుంటాను. వోయి రహిమాన్, ఇదిగో ఇది తీసుకు వెళ్ళి ఖాళీ చేసివ్వు. (చిన్న పెట్టె తీస్తుంది)

అక్కా నాకో కిళ్ళీ కట్టరా?

అఫ్తాబ్ బేగం: రహిమాన్, నా వంతు కూడా నువ్వే తీసుకో (అంటూ కిళ్ళీ కట్టడంలో మునిగిపోతుంది. మొహమ్మదీ బేగం కోలాన్ చేతికి రెండు అణాలు ఇస్తుంది.)

మొహమ్మదీ బేగం: అందరికీ నా అభినందనలు చెప్పు. కొద్దిగా ఆరోగ్యం మెరుగవ్వగానే నేనే వస్తాను. నిన్ను చూస్తే మళ్ళీ అందర్నీ త్వరలోనే చూడాలనే కోరిక కలుగుతోంది. పుట్టిన బిడ్డను నిజంగా చూడాలని ఉంది. ఇక్కడికి రాకూడదని ఒట్టేమయినా పెట్టుకుందేమో వదినని అడుగు. (ఈ మాటలంటూ నడముకున్న బట్టల్లోంచి రెండణాలు తీసి కోలాన్‌కి ఇస్తుంది.)

కోలాన్: బేగం సాహెబా, మా అమ్మగారు కూడా మిమ్మల్ని ఎంతగానో తల్చుకుంటారు. కానీ పాపం ఆమెకసలు సమయమే దొరకదు. ఇప్పుడు ఇల్లు మొత్తం నిండిపోయింది. అందరూ వస్తూ పోతూ ఉన్నారు.

అఫ్తాబ్ బేగం: సుల్తానాకి నా ఆశీర్వాదాలు కూడా తెలియజెయి. ఇంకా మనవడికి నా శుభాకాంక్షలు. దేవుని కృప ఉంటే ఈ శుక్రవారం నేనే వస్తాను. (కోలాన్ ఖాళీ పాత్రలు తీసుకుని సలామ్ చేసి బయలుదేరుతుంది.)

మొహమ్మదీ బేగం: సుల్తానా భాబీది అంతా వేరే తరహా. వాళ్ళాయన జీతం నెలకి మహా ఐతే 40 రూపాయలు ఉంటుందంతే. కానీ ఉన్న దాంట్లోనే ఆమె అన్ని పనులూ చక్కగా సమకూర్చుకుంటుంది. అలాగే చక్కబెట్టుకుంటూ కొడుకులకి, కూతుర్లకి పెళ్ళిళ్ళు చేసేసింది. ఇప్పుడు ఆ దేవుడి దయతో కొడుక్కి మంచి ఉద్యోగం దొరికింది. 115 రూపాయల జీతం. ఇంకా పై స్థాయికి వెళ్ళేందుకు కూడా అవకాశముంది.

అఫ్తాబ్ బేగం: ఆ కోడలు కూడా మంచిదే (సైగ చేస్తూ) అంతా రాత.

మనల్ని చూడు. సరే, వదిలెయ్. కానీ రజియా గురించిన వార్తలేమయినా ఉన్నాయా? మీ మామయ్య ఎవర్నీ కనీసం పిలవకుండా హడావుడిగా పెళ్ళి చేసేసాడు.

మొహమ్మదీ బేగం: పిలవకపోతే ఏం పుట్టి మునిగిపోయింది ఇప్పుడు? అందరిళ్ళకి, ప్రతీ కుటుంబానికీ రెండేసి, మూడేసి సార్లు తినుబండారాలు, గుభాళించే పదార్థాలు పంపాడు కదా. పాపం, దాని పెళ్ళి అలాంటి పరిస్థితుల్లో జరగాల్సి వచ్చింది. అంతా దౌర్భాగ్యం. దేవుడు వారందర్నీ ఆశీర్వదించు గాక.

అఫ్తాబ్ బేగం: అలాగా? నాకు తెలీదే? ఏం జరిగింది?

మొహమ్మదీ బేగం: నిజంగానా? నీకు తెలీదా? ఇప్పుడు అందరికీ ఈ సంగతి తెలిసిందే. ఆమె చాలా చిన్నది. మా సబీరా కంటే రెండేళ్ళు చిన్న. నా పెళ్ళి తర్వాతే అది పుట్టింది. చాలా రోజుల తర్వాత చిన్న మావయ్య కలకత్తా నుంచి వచ్చేనాటికి అందరం బాగా చిన్నవాళ్ళం. నానమ్మ, వణుక్కునే చేతులతోనే అయినా ఆందంగా అంతా చక్కబెట్టేది. అప్పుడు కొన్నాళ్ళు ఇక్కడ ఉండటానికని రజియాను నాతోపాటు తీసుకొచ్చాను. చిన్నత్త వాళ్ళ పుట్టింటికెళ్ళింది. ఆ అమ్మాయి ఇక్కడ మూడ్నాలుగు మాసాలుంది. రజియాకి తన తండ్రి కుటుంబం అంటే ఎంత అభిమానం అంటే, ఆమె వాళ్ళ కోసం ప్రాణాలయినా ఇచ్చేస్తుంది. తల్లి తరపు పరివారంతో ఆమెకి అంతగా అనుబంధం ఉండేది కాదు. ఇది నా ఇల్లు, అంటే తోబుట్టువు ఇల్లు. కానీ ఏం జరుగుతోందో నాకు కొంచెం కూడా తెలిసేది కాదు. ఆమె తల్లి పుట్టింటి నుండి రాగానే రజియా తిరిగి వెళ్ళిపోయింది. ఒకరోజు కబురు పంపింది. అక్కా, "దేవుడి దయ, వెంటనే ఇక్కడికి రా" అని. ఇంక ఏం చెప్పను? వెళ్ళాక ఆమె అంది, చిన్నత్త ఎంత తియ్యగా నటిస్తుంది? రజియా నా చేతికో లేఖ ఇచ్చి

అంది. "(మీ ఆయన) బావ ఇక్కడికి రోజూ వస్తున్నాడు. అమ్మ ఇష్టంగా ఆయనకి సపర్యాలు చేస్తోంది" రహస్యంగా చెప్పింది. పాపం పిచ్చి పిల్ల, ఇంకేం చెప్పగలదు? అది చెప్పడానికే అదెంత ధైర్యం కూడగట్టుకుందో. ఇక ఆ ఉత్తరం – అది రజియాకి ఈయనగారు రాసిన ప్రేమలేఖ లాంటిది. శృంగార నవలల్లో కూడా అలాంటి పదాలు దొరకవు. ఆపుకోలేనంత కోపమొచ్చింది నాకు. రజియాతో మాట్లాడి తన పేరు బయటకు రాదని ఒప్పించాను. సణుక్కుంటూ వచ్చి ఈయనతో మాట్లాడాను. దేవుడి తోడక్కా, కనీసం కొంచెం కూడా సిగ్గూ శరం లేకుండా మాట్లాడాడు. 'ఐతే, ఏమైందిప్పుడు' 'అవసరమయితే నీకు తలాక్ చెప్పి రజియాను పెళ్ళి చేసుకుంటాను.' 'మతుండే మాట్లాడుతున్నావా? ఆమె గౌరవనీయ కుటుంబం నుండి వచ్చింది. ఆమె పేరు గట్టిగా ఉచ్చరించినా ఆమె తండ్రీ, సోదరులు నిన్ను ముక్కలుగా నరుకుతారు. ఆమె పట్ల అలాంటి భావన కలలోకి కూడా రానియ్యకు' అన్నాను.

అఫ్తాబ్ బేగం: అందుకేనా, అంత త్వరత్వరగా ఆదరబాదరాగా తంతంతా ముగించారు?

మొహమ్మదీ బేగం: మరి? ఇంకేం చేసేది? చాలా కాలం నేనన్నా, తల్లన్నా ఆమె తీవ్రమైన ద్వేషం పెట్టుకుంది. అమ్మకి ఒంట్లో బాగా లేనప్పుడు కూడా తాను ఈ ఇల్లు నాశనమైపోవాలని శాపనార్థాలు పెట్టింది. మాపట్ల మాత్రమే కాదు. పెద్ద మావయ్య మీద కూడా శత్రుత్వం పెంచుకుంది. మావైపు కుటుంబంలోని అబ్బాయితో రజియా పెళ్ళి ఖాయమయ్యాక ఆమె తన కూతుర్ని శత్రువుల ఇంటికి పంపేది లేదని గొడవలు పడుతుండేది.

అఫ్తాబ్ బేగం: (నవ్వుతూ) మీ ఆయనలో అంత గొప్ప ఆకర్షణీయ విషయం

ఏముందనీ? అతనికి భార్యా, పిల్లలూ ఉన్నారు. ఇంకా డబ్బుందనుకో. ఆ మాటకొస్తే మీ పెదమావయ్య కూడా ఏమంత లేనివాడు కాదేం. ఇలాంటివి ఎప్పుడయినా గౌరవనీయ కుటుంబాల్లో జరిగాయా? పడమటి దిక్కున దూరంగా కొన్ని ప్రాంతాల్లో అక్కా చెల్లెళ్ళు ఇద్దరూ వాళ్ళ కూతుర్లని ఒకే మగాడికిచ్చి పెళ్ళి చేస్తారట. కానీ మన కుటుంబాల్లో ఇలాంటివిదివరకు జరిగినట్లు లేదు. ఏదేమయినా ఇదో కొత్త తరం, కొత్త కాలం. చూస్తుంటే ఇప్పట్లో ఏదయినా జరగచ్చు అనిపిస్తుంది. మరి, ఆ తర్వాత ఏమైంది?

మొహమ్మదీ బేగం: ఎప్పుడైతే నేను సహనం కోల్పోయానో అప్పుడు బుజ్జగించడం మొదలెట్టాడు. ''నన్ను నమ్ము. నేను ఆమెను కోరుకుంటున్నాను. దేవుని తోడు, నాకు సహాయం చెయ్యి. సాయం చేయడం నీ బాధ్యత. ఖురాన్ తీసి భర్తకి కనుక సాయపడకుంటే నరకంలో భార్యపడే చిత్రహింసల చిట్టాను ఆయతుల నుండి చదవడం ప్రారంభించాడు. అంతకంటే, ఇంకేం ప్రళయాగ్నులున్నాయి, నన్ను కాల్చి బూడిద చేయడానికి. దానికి తోడు ఆయన పిచ్చి రాను రాను ముదిరిపోయింది. గదిలోంచి బయటకు వచ్చేవాడు కాదు. మంచం మీద పడుకుని 'హా రజియా, హా రజియా' అని కలవరించేవాడు. నన్ను నమ్ము, నా హృదయం మొత్తం ఈ పీడన వల్ల కల్లోలమైపోయింది. దేవుడి మీద ఆన, ఈ ఆస్తిపాస్తులు, విలాసాలు అన్నీ నాకు బరువెక్కిపోయాయి. జీవితంలో కాస్త ఆనందం ఉంటే చాలును. బీదరికంలో ఐనా ఆకలి తీర్చుకోడానికి రొట్టెముక్క తిని బతకొచ్చు. అక్కా, ఒక కిళ్ళీ ఇవ్వవా, మాట్లాడి మాట్లాడి నోరెండిపోయింది. (పాత్రలో నీరు తాగుతుంది. అఫ్తాబ్ తనకో కిళ్ళీ తీసుకుని

మొహమ్మదీకి కూడా ఒకటిస్తుంది.) ఒక్క మాటలో చెప్పాలంటే, ఈ స్థితి మారేటట్టు కనిపించలేదు. ఆ పెళ్ళికాని అమ్మాయి గురించి రోజూ అసభ్యంగా, కాముకంగా మాట్లాడేవాడు. నేను ఉక్కిరిబిక్కిరవుతూ మౌనంగా అసహాయంగా వింటూ ఉండేదాన్ని. చిన్నత్త మాత్రం ఇంకా అభిమానంగా ఉంటూనే ఉంది. 'రజియా, మీ బావగారొచ్చారు, ఆకు, వక్కా అందించు' అనేది.

అఫ్తాబ్ బేగం: మీ మామయ్యను ఉసిగొల్పినవి ఈ పరిస్థితులే అనమాట.

మొహమ్మదీ బేగం: ఇంకేముంటాయి మరి? ఆ పిల్ల గంటలకొద్దీ ఏడుస్తుండేది. తన కోపతాపాలన్నీ కల్సిన చోటల్లా నాకు చెబుతుండేది. నేనో నెల రోజులు మౌనంగా ఉన్నాను. తర్వాత ఇద్దరు మామయ్యలు వోసారి ఇంటికి వచ్చినప్పుడు అడిగాను, 'రజియాకి పెళ్ళి చేసే ఆలోచన విరమించుకున్నారా ఏం', అన్నదమ్ములిద్దరూ నాకేసి వింతగా చూసారు. అప్పుడు వివరించి పరిస్థితి చెప్పాను. ఇద్దరు బాగా ఆలోచించారు. ఫలితంగా మూడో రోజునే రజియా ఒక ఇంటిదైంది.

అఫ్తాబ్ బేగం: అంతా నీ దయ అల్లాహ్. సుఖంగా ముగిసింది అల్లాహ్.

మొహమ్మదీ బేగం: కానీ, అత్తా అతను ఆరు నెలలు ఇంట్లోకి అడుగు పెట్టలేదు. చావిడీలోని వేశ్యల దగ్గరికే వెళుతుండేవాడు. నేను సంతోషించాను. అక్కడికాయన వెళ్ళినప్పుడు ఎంత ప్రశాంతంగా నిద్రపోయేదాన్నో ఆ దేవునికే తెలుసు. కానీ, ఇప్పుడు మళ్ళీ రోజూ అదే కథ. 'నువ్వేమో జబ్బుపడ్డావు, నేను ఎంత కాలమని ఆగగలను? కాబట్టి, నేను మళ్ళీ పెళ్ళి చేసుకుంటాను.' ఇంకా బలవంతం చేస్తూ, 'నువ్వే పూనుకుని నాకు మరో పెళ్ళి చెయ్యాలి. ఇస్లామిక్ చట్టం నాలుగు పెళ్ళిళ్ళను అనుమతిస్తున్నప్పుడు, నేను మరో వివాహం ఎందుకు చేసుకోకూడదు?' అప్పుడు నేను, "సరే

చేసుకోండి ఎలాగూ సబీరాకి ఇంకో ఏడాదిలో పెళ్ళి చెయ్యాలి, తండ్రీ, కూతురు ఒకేసారి పెళ్ళి చేసుకుంటే సరిపోతుంది. నీ కొత్త పెళ్ళాం బిడ్డని ఒక చేతితో, మనవడ్ని మరో చేత్తో ఎత్తుకోవచ్చు. అంతే! ఆ మాటలకి గొడవ మొదలెడతాడు, 'ఇదంతా ఆడవాళ్ళకేం తెలుసు. మాకున్న కోరికలు దేవుడు ఆడవాళ్ళకి అనుగ్రహించలేదు. అప్పుడు నేను 'మొత్తం మగజాతి కోరికలన్నీ నీలోనే కేంద్రీకృతమై ఉన్నాయి' అనేదాన్ని.

అఫ్తాబ్ బేగం: (అంతరాయం కలిగిస్తూ) మొహమ్మదీ బేగం, మీరు ఎక్కడికెళ్ళినా ఎదురయ్యేది అదే సమస్య. మార్గమంతా మగాళ్ళ సంతే, ఏ స్థితిలోనయినా వాళ్ళదే విజయం, పరాజితులం మనమే. 'నేను మళ్ళీ పెళ్ళి చేసుకుంటా'ననడం ఎంత దుర్మార్గం. పైగా 'నా భార్యే స్వయంగా పెళ్ళి కూతుర్ని సమకూర్చాలనడం ఒకటి. ఎంత దుష్టత్వం.

మొహమ్మదీ బేగం: నేను తీవ్ర నిరాశతో తచ్చాడుతూ నా జీవితాన్ని ఇక చాలించమని ప్రార్థించడానికి గల కారణం ఇదే. నాకున్న అనారోగ్యం చాలదన్నట్లు ఈ పిల్లలతో పరిస్థితులు ఇంకా దిగజారిపోయాయి. పెద్ద పిల్లల ఆరోగ్యం దేవుడి దయవల్ల ఫర్వాలేదు కానీ, చిన్న పిల్లల ఆరోగ్యం అసలు మెరుగ్గా లేదు. ఇదంతా కలిసి నాలో జీవించాలనే ఆశను చంపేసింది. ఆయన రెండో పెళ్ళి గురించిన ఊహే నన్ను నిత్యం వెంటాడుతోంది. దేవుడా, ఆయన మరో స్త్రీని ఈ ఇంట్లోకి తీసుకునొచ్చే లోపలే నాకు చావును ప్రసాదించు. ఆ మరో స్త్రీ భయంతో నేను చేయనిది అంటూ ఏదీ లేదు. రెండు పెద్ద శస్త్ర చికిత్సలు చేయించుకున్నాను.

అఫ్తాబ్ బేగం: నువ్వు పిల్లలు పుట్టకుండా ఏదో చేయించుకున్నావని మేమంతా విన్నాం.

మొహమ్మదీ బేగం: ఇదంతా ఎవరు చెప్పారు నీకు? నిజం ఏమిటంటే, నా గర్భ సంచి కిందికి జారిపోతోందట. దానిని సరిచేస్తే మా ఆయనకి కొత్త భార్య దగ్గర పొందే సుఖం నా శరీరంతోనే పొందొచ్చుట. అక్కా, ప్రతీ సంవత్సరం వరుసగా పిల్లల్ని కనే ఆడదాని శరీరం ఎంత కాలమని బిగుతుగా ఉంటుంది చెప్పు? మళ్ళీ జారిపోతుంది, వదులైపోతుంది. అప్పుడు మళ్ళీ బలవంతపు బెదిరింపులతో రోజూ హత్య చేయబడతాను, మాటలతో వధించబడతాను. ఇదంతా పక్కన పెడితే ఆయన ఇప్పటికీ అసంతృప్తిగానే ఉన్నాడు. (మసీదు నుండి ప్రార్థనకి పిలుపు వినబడుతుంది)

అఫ్తాబ్ బేగం: మధ్యాహ్నం నమాజ్‌కి సమయమైంది. మాటల్లో పడి కాలమే మర్చిపోయాను. (ఆమె తన తలపై ప్రార్థన కోసమని గుడ్డ కట్టుకుంది) నమాజ్ తర్వాత ఇక వెళతాను. పాపం మీ బావగారు ఎదురు చూస్తుంటారు.

మొహమ్మదీ బేగం: అంతా దేవుడి దయ అక్కా, ఈ రోజు నువ్వొచ్చావు. కనీసం నా గుండెల్లో బరువు దింపుకున్నాను. తరచుగా వస్తుండు. ఈ రోగంతో నేనెక్కడికీ బయటకు రాలేను. (అంటూ రహిమాన్, రహిమాన్, గుల్బాబూ!' రహిమాన్ కనబడతాడు.)

మొహమ్మదీ బేగం: వెళ్ళు, వెళ్ళి బడీ బేగం ఉజూ (నమాజ్ చేయడానికి ముందు సిద్ధపడే పరిశుభ్ర పద్ధతి – అను) చేసుకోడానికి సహాయం చేయి.

(తెర పడుతుంది)




అలీఘడ్‌లో జననం

(25-08-1905)



## డాక్టర్ రషీద్ జహాన్ M.D. గైనకాలజిస్ట్





రష్యాలో మరణం

(29-07-1952)

భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ స్థాపించి వందేళ్ళవుతోంది. దశాబ్దాల చరిత్ర కలిగిన ప్రగతిశీల సాంస్కృతికోద్యమం, అభ్యుదయ రచనోద్యమం కూడా ప్రస్తుతం స్తబ్దంగా ఉన్నాయి. మరోవైపు తిరోగామి శక్తులు రోజురోజుకు బలం పుంజుకుంటున్నాయి. అవాంఛనీయ అసమానతలు పెరుగుతున్నాయి. ఈ క్రమంలో రషీద్ జహాన్ వంటి అంకితభావం గల వ్యక్తుల్ని గుర్తు చేస్కోవడం అవసరమనే అభిప్రాయమే ఈ అనువాదానికి కారణం.

డాక్టర్ రషీద్ జహాన్ నాటకంలో, కథల్లో ముస్లిం సమాజపు వాస్తవికత కన్పిస్తుంది. ఎక్కడా రొమాంటిసైజ్ చేయడం కనపడదు. ఇతర మతాల్లో ఉన్నట్లే ముస్లిం సమాజంలో స్త్రీ పురుష అసమాన సంబంధాల్లో ఉండే అమానవీయతను, వాళ్లమీద అమలవుతున్న సాంప్రదాయాల్లో... మతాచారాల్లో వెతుకుతూ వాటిని రాజకీయార్థిక, సామాజిక కోణాలలో చర్చకు పెట్టారు.

డాక్టర్ రషీద్ జహాన్ అభ్యుదయ రచయితల సంఘం సభ్యురాలు, కమ్యూనిస్టు నాయకురాలు, ప్రజా రచయిత్రి అవడం మూలాన్న ఆమె తన వద్దకు వచ్చిన స్త్రీ రోగుల మానసిక, శారీరక ముఖ్యంగా గైనిక్ అంటే ప్రత్యుత్పత్తి సమస్యలు, ప్రసవానికి సంబంధించిన అనేక అంశాలను మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించి విశ్లేషిస్తూ నేర్చుకోవడమే కాదు సాహిత్యంలో యథాతథంగా తీసుకొచ్చారు. డాక్టర్ రషీద్ జహాన్ తొలి కమ్యూనిస్టు ముస్లిం డాక్టరు!